ఓం.

# పార్వతీశశతకము

గ్రంథకర్త,

నిష్టల కృష్ణమూర్తి.




రైతాంగ ముద్రణాలయంలో ముద్రితము.

శ్రీకాకుళం.

1939. వెల....







శ్రీ శివ సచ్చిదానంద సద్గురు పరబ్రహ్మణేనమః

# పార్వతీశ శతకము.

---

శ్రీశః యోపరేశ; శిరమున గంగను
దాల్చినావు జలము । ఘటణికొసగ
జలము పావనిగద । సకల జీవములకు
భక్తహృన్నివాస । పార్వతీశ॥ 1

ఆ॥ వె॥ గంగనీరు సతము । గడుభక్తి జరియించి
సేవజేయు శ్రద్ధ । భావమునను
భక్తిచేత గాదె ? పుముమోదపరమౌట ॥భక్త॥ 2

ఆ॥ వె॥ చంద్రమౌళి! నేడు । చలమదేలను నీకు
తలను జంద్రిదెపుడు । దగిరియుండ
చల్లదనముచేత । శాంతిలవేలకో ॥భక్త॥ 3

ఆ॥ వె॥ నగలు పెట్టుకొనవు । నందివాహన నీవు
పూసలేసికొందు । వోసియాస
ఆశలేనివార । లరుదయా జగమున ॥భక్త॥ 4

ఆ॥ వె॥ గరళమెంత వేడ్క । గరిళించివైచితో
కనికరమున ప్రజల । గావనెంచి
గరళమొకట గుణము । గావించుటెరుగుదా ॥భక్త॥ 5

ఆ॥ వె॥ ఎద్దునెక్కినీవ । డెంతయో ప్రీతితో
ధరణిలోనదిరిగి । దిరిపెమెత్తు
బిచ్చగాడ వెట్లు । బీదలంగాచెదో ॥భక్త॥

ఆ॥ వె॥ కొండనెక్కినావు । కోపమా యిదినీకు
భూమిచేయు దోష । మేమిచెపుమ
రయమునం గిరిదిగి । దయనేలు జగమును ॥భక్త॥

ఆ॥ వె॥ చేయరానిపనులు । చేసియునుండిన
హర హర। యనివల్క । నఘమువాయు
నీదు నామమహిమ నేరు వెన్నగలాడు ॥భక్త॥

ఆ॥ వె॥ భువనములను పుణ్య । పురుషుల హృదయంబు
లందు నుండునట్టి । యఘవినాశ
నన్నుజేరకుంట । నాయింపెనికది ॥భక్త॥

ఆ॥ వె॥ ఆదిపురుష నీకు । నభ్యాసమాయేమి
భక్తకోటికెల్ల । బాధలిడగ
బాధకోర్వలేని । వారి బ్రోవవదేర ॥భక్త॥

ఆ॥ వె॥ మంచిచేయువారు । మహిలోన కొందరే
చెడ్డచేయు ప్రజ వి । శేషముంద్రు
నీదు లీలగాదె । నిజముగ నిదియంత ॥భక్త॥

ఆ॥ వె॥ పేరురెన్నిపెట్టి । పిలిచిన పలుకవు
పాపమేమిచేసి । పరగినానొ
పరమపురుష నాకు వరములీయవవేగ ॥భక్త॥

ఆ॥ వె॥ లేరు నాకు దిక్కు । వేరు భూతలమున
నీవెదిక్కువౌచు । నేలుకొమ్ము
గావకున్న నేను : గాసిలుచుందును ॥భక్త॥

ఆ॥ వె॥ దీనరక్ష నీవు । దీనులపాలింట
కల్పవృక్షమగుదు : గాదె జగతి
కల్పవృక్షమెవుడు : కలుపునుదొలగింపు ॥భక్త॥ 14

ఆ॥ వె॥ పేదవారిజూడ । పెనుపండువగు నాకు
చేయనిమ్ము వారి : సేవనెపుడు
నట్టిసేవయె నిను । నత్తియుండునుగాదె ॥భక్త॥ 15

ఆ॥ వె॥ తిట్టబోవక యొకరి । తెన్నునుబోపక
బట్టుదలగ నిన్ను । భజనసేయ
ముక్తిరాదె నరుని । శక్తికి దగినట్లు ॥భక్త॥ 16

ఆ॥ వె॥ తల్లిదండ్రి గురువు । తగముగ్గురును నీవె
నేటికింక నాక । చేటిలోటు
పాపభీతినాచి । పాలింపనీవుండ ॥భక్త॥ 17

ఆ॥ వె॥ విరివిగాను నేను । విద్య నేర్వగలేదు
పాటపాటుటంత । బాగరాదు
మనసులోన నిన్ను । మరిమరివేడెద ॥భక్త॥ 18

ఆ॥ వె॥ ఉచరించితెన్నొ । యనుచితకృత్యముల్
విషయలోలుడనుగ । విశ్వమందు
సన్నువాగువేసి । నయమున నికబ్రోవు ॥భక్త॥ 19

ఆ॥ వె॥ విషయవాంఛలెల్ల విడుపంగవలె వేగ
భక్తుడైన నరుడు । పట్టుదలగ
వీడకున్ననవియె । విషమించు నిజమెందు ॥భక్త॥ 20

ఆ॥ వె॥ వాదులాడువారు । వసుధలో నెందరో
పొందుచేయువార । లుందురేమొ
కొందరిలను: వారినెందరినో చేయు ॥భక్త॥ 21

ఆ॥ వె॥ భారమనక జగతి । నోరార నీపేరు
పలుకు నరులనీవు । భద్రముగను
గాచిప్రోతు వెంత । కరుణామయుండవో ॥భక్త॥ 3

ఆ॥ వె॥ దుష్టులదునుమాడి । శిష్టుల రక్షింప
రక్షకుండవీవు । రారవేగ
వేగరాకయున్న । వేగిరపడుదును ॥భక్త॥ 3

ఆ॥ వె॥ భక్ష్యములవియేవి । లక్ష్యముసేయక
భక్తపరులవారి । శక్తిజూచి
ముక్తినిత్తు వెంత । యుక్తితో రక్తితో ॥భక్త॥ 3

ఆ॥ వె॥ దిక్కులేక నేను । దిర్గుచుంటిని
స్థిరములేక నెన్నొ । పురములందు
నెండుకట్లు నన్ను । గుందంగజేతువు ॥భక్త॥ 3

ఆ॥ వె॥ సరిగున బిలుచును । సన్యాసులనుగాంచి
పట్టెదన్నుమిదెడు । పర్గులగాంచి
రక్షణంబుసేయు । లక్షణంబదినీది ॥భక్త॥ 3

ఆ॥ వె॥ చేతగాక [illegible]సినభక్తికి
మనసుకరుగదౌర । మరువువాస
చేతఁబూనటు నను । సేయపదేలకో ॥భక్త॥ 3

ఆ॥ వె॥ కొడుకుచేయునట్టి । దుడుకుపనులు తండ్రి
కాచిదిద్దునెంత । కరుణజూపి
కరుణనల్ల నన్ను । గావజూడు యుమేశ ॥భక్త॥ 3

ఆ॥ వె॥ వెఱ్ఱివాడనేను । వేరేమితెలియదు
మాటలాడవాక । దేటికిపుడు
మౌనిజేయుమిలను । మాటలబనిలేక ॥భక్త॥ 3

ఆ॥ వె॥ దశముఖహరణ నీవు । శరణిచి జనులెన్నొ
చేయుచుంటివనియు । చెన్నుమీర
నీదు మహిమదెలియ । నేనెంతవాడను ॥భక్త॥

ఆ॥ వె॥ సకల జగములేలు । సత్యమూర్తివి నీవు
దీనుడ ననుబ్రోవు । దీనపోష
మొఱ్ఱికుఱచుంటినయ్య । మొరవినవదియేమి ॥భక్త॥

ఆ॥ వె॥ భూతలేశ నాకు । భూరివైభవమిమ్ము
ఇవ్వకున్న నేన । దేడబోదు
నన్నుగావవేగ । నాతండ్రిరావేమి ॥భక్త॥

ఆ॥ వె॥ భూతనాద నన్ను । బ్రోవవదేలనో
క్షేమసేయునట్టి । నెరసులున్న
విషము మ్రింగువాడ । విముగకనన్నావు ॥భక్త॥

ఆ॥ వె॥ మాయచేత నీవు । మనుజాల సృష్టియించి
నాటకంబులాడు । వందివాహ
నన్నునేల నీకు । చిన్నతనంబటౌనె ॥భక్త॥

ఆ॥ వె॥ పాము చందనతరు । బరగజుట్టియున్న
నరులుజేరి తరువు । నయముగొనరె
భయమదేల యుక్తి । బాగుగనుంచంగ ॥భక్త॥

ఆ॥ వె॥ అల భగీరదుండు । అనాథు వినువేడ
నవనిబెంప గంగ । నంపలేదె
వానిబెంచినట్లు । వసుధగావవెనన్ను ॥భక్త॥

ఆ॥ వె॥ షణ్ముఖునొకనిగను । జన్మింపజేసియు
అసురులందుమహాది । యభయమిచ్చి
సురలనరయు నీకు । నరులగాచుటదెంత ॥భక్త॥

ఆ॥ వె॥ పాశుపతముదలచి । పాండవమధ్యము
నకు నిడంగలేదె । నయముమీర
అస్త్రములవియేల । ఆదరించినజాలు ॥భక్త॥ 46

ఆ॥ వె॥ చెంచువేషమున్న । వంచించి నరునితో
బోరుసల్పి వాని । బ్రోవలేదె
బ్రోవుమాటనీకె । మురహరతగుగదా ॥భక్త॥ 47

ఆ॥ వె॥ ఉభయసంధ్యలందు । ఓంకారసామివై
జగతి సంగ్రహణము । జక్కబెట్టు
నేర్పదెట్లువచ్చె । దీర్పక నాభాధ ॥భక్త॥ 48

ఆ॥ వె॥ జిలిబిలి పలుకులను । పలికెడి శిశువును
తండ్రిముద్దుగొనుమ : దండజేర్చి
నాదు పలుకులువిని । నన్గావమరచితో ॥భక్త॥ 49

ఆ॥ వె॥ నిష్ఠతోను నేను । కష్టముల్ పడుచును
నీదుసేవలెన్నొ । మోదముగను
చేయుచుంటిగాన । నేమంబుగాజూడు ॥భక్త॥ 50

ఆ॥ వె॥ వెక్కసములనాడు । వెఱ్ఱిపీరిడి గుణ
మెంత పూనియైన । ద్రిప్పలేము
కుక్కతోకగట్ట । జక్కబడనిరీతి ॥భక్త॥ 51

ఆ॥ వె॥ నాదుభాగ్యమేమొ । నీదుసామార్చన
నేటికింతకలిగె । సాటిలేక
పాపనాశనుండ । యాపదలెడబాపు ॥భక్త॥ 52

ఆ॥ వె॥ ధనముపైని యాశ । దద్దయుంబెద్దయై
నీపయిమది నిల్వ । నీదదేమొ
పామరత్వమదియు । ప్రాపింపజేయకు ॥భక్త॥ 53

ఆ॥ వె॥ అర్థనపరుడైన । ఆదరింతురు జనుల్
ధనములేనివాని । దయనుగనరు
ధరణిలోన ధనమె । తగుముఖ్యమైనది ॥భక్త॥

ఆ॥ వె॥ నీపదభజనమున । పాపములెన్నైన
భస్మమౌగదెంతొ । విస్మయముగ
దక్షయజ్ఞనాశ । రక్షించుభక్తుల ॥భక్త॥

ఆ॥ వె॥ నీపదములు మదిని । నిల్పినీపూజలు
నేమరకనుదినము । నేర్పుమీర
చేయుచున్ననన్ను । చేరదీయవ దేవ ॥భక్త॥

ఆ॥ వె॥ దుష్టనరునదెంత ॥ యిష్టముతో బెంప
కష్టములనుపెట్టు । గానజగతి
బెల్లముంచి వేము । బెంచుటకూడునా ॥భక్త॥

ఆ॥ వె॥ తననుగూర్చి యేమొ । యనుకొనుననుకొని
ఎల్లలోటువాడు । ఏమిసేయు
నాడుమాటయొకని । నైగాకయాడడు ॥భక్త॥

ఆ॥ వె॥ శ్రమలుపడుచు నిన్ను । సంతతమునువేడ
నెట్టినరునినైన । యెంతుదయను
భయమునుదీర్చిగాచు । దయకాకరమవుగ ॥భక్త॥

ఆ॥ వె॥ తప్పులెంచరాదు । తగదిద్దవచ్చును
పెద్దలకది తగును । పృధివియందు
ధరణి నెవరులేరు । తప్పుచేయనివారు ॥భక్త॥

ఆ॥ వె॥ అఖిలభూతములను । నాడించుచుందువు
చిద్విలాసగతిని । చిన్మయాత్మ
అట్లనారతంబు । నాదరించుము నన్ను ॥భక్త॥

ఆ॥ వె॥ సగుణనిర్గుణునకు । నెగడుచుందువెపుడు
నిఖిలలోకములను । నేర్పుమీర
నిన్ను సన్నుతింతు । నియమముగానెందు ॥భక్త॥ 62

ఆ॥ వె॥ తత్వములను జాడ । తగదు ఎచ్చోటైన
యర్థమెరుగకుండ । వ్యర్థముగను
తగును పాదనొక్క । తత్వజ్ఞుడేకదా ॥భక్త॥ 63

ఆ॥ వె॥ పఠనచేయుసరియు । పంచాక్షరీ మంత్రి
మహిమనెరుగకుండ । మహినినరుడు
దాని పంచిచయున । జ్ఞానికేయులపడు ॥భక్త॥ 64

ఆ॥ వె॥ నీదు భజనసేయ । నెన్నొయాటంకముల్
సంభవింపనేల । సరిగుననిల
విఘ్నసంఘములను । విరగడచేయుమా ॥భక్త॥ 65

ఆ॥ వె॥ ఓం శివశివ యనుచు । నోంకారమూర్తిని
వీటుగానువ్రాయ । గోటిసార్లు
మనసునిలుపుట కిల । మరితోవగాదయా ॥భక్త॥ 55

ఆ॥ వె॥ పేదవారిగాచు । పేగపురుషుడ నా
దిక్కుయుంమనమ్మి । ధీరతగను
ఒంటరినయి వేడు । తుంటరిననుగావు ॥భక్త॥ 57

ఆ॥ వె॥ వైకొనవడిమేల । కైలాసవాసుండ
యేనుజేయుపూజ । లొప్పుమీరె
నొప్పిదముగ నాదు । తప్పిదములదిద్దు ॥భక్త॥ 58

ఆ॥ వె॥ బాగుచేతుపండ్రు । భక్తులనెప్పుడు
చేరినన్ను బాగు । చేయకున్న
చర్మధారినీకు । ధర్మముకాదయా ॥భక్త॥ 69

ఆ॥ వె॥ అందగాడపనియు । కొందరందురుకాని
పాములేనగలని । పరిహసింతురి
నేనుమాత్రము విను । నెలరాల్పుపందును ॥భక్త॥

ఆ॥ వె॥ కల్లనాడు విసము । యుల్లమందుననిన్ను
స్మరణచేయుచుందు । స్మయముపీడి
స్మయములేనిజనుల । స్మరహరికావనే భ॥

ఆ॥ వె॥ తపముచేయనేల । తగశివసీనామ
జపముసలుపజాలు । జక్కగాను
నట్టివాని నన్ను । రెట్టింపుదయగను ॥భక్త॥

ఆ॥ వె॥ నిన్ను సన్నుతింతు । నన్ను మనసునిల్వ
దేమిసేతునయ్యొ । సామి నాదు
చిత్తమెపుడునింక । తత్తరపడనీకు ॥భక్త॥

ఆ॥ వె॥ ఎట్టినరునికైన । గట్టిగా కష్టముల్
సంభవింపనతడు । చంద్రమౌళి
నిన్ను తప్పకుండ । సన్నుతించునపుడు ॥భక్త॥

ఆ॥ వె॥ ఇపుడుగాదె నాకు । నిపుణభక్తివలన
సందియములు చాల । సమసిపోయె
బ్రతుకగలను నేను । పరమేశ నినుగొల్వ ॥భక్త॥

ఆ॥ వె॥ మనిషిదేహమందు । మదనాగ్నిలేకుండ
నుండువరకుపోవ । కుండనుండు
జ్ఞానశీలవంశ । మానములికకొన్ని ॥భక్త॥

ఆ॥ వె॥ దేహమందునాకు । తెలివిలేనిదినము
యరుగుదెంచునెపుడు । యలరునట్టి
దినమె సుదినముగను । కనగజేయుమునన్ను ॥భక్త॥

ఆ॥ వె॥ నయముగ జననీ జ । నకులను పూజింప
పలెను బిడ్డలెప్పుడు । భక్తినీర
దైవసములుగారె । ధర తలిదండ్రులు ॥భక్త॥ 73

ఆ॥ వె॥ చింతనంబుచేసి । చెలగి ఎంతపనినొ
సలుపవచ్చు ధరను । శాంతిగలుగ
శాంతముండ నరుడు । జక్కబడునుగాదె ॥భక్త॥ 7

ఆ॥ వె॥ సంచితంబుభప్ప । దంచితభక్తిని
సలుపగానునెంత । సరిశగతిని
యనుభవింపవలెను । [illegible]డు సంచితమును ॥భక్త॥ 8(

ఆ॥ వె॥ జాతులెన్నొకలవు । జగమున పెక్కులు
జాతులెన్న జనడు । జయముగనడు
జాతివిడువ నదియె । సత్యమార్గముకదా ॥భక్త॥ 81

ఆ॥ వె॥ మరపు ఎరుకలవియె । మరచి నరుడువేగ
శుద్ధిజేయ మనసు । సుస్థిరమగు
అతడె సిద్ధయోగి । యగును నిక్కముగాను ॥భక్త॥ 8.

ఆ॥ వె॥ జ్ఞానముండి స్నాన । పానంబులుమరేక
దిరుగునొకడు ధరణి । దిరముగనక
లోకులేమెరుగరు । లోగుట్టువానిది ॥భక్త॥ 8

ఆ॥ వె॥ తల్లినాలిబిల్ల । తనవారియట్లుగా
పామరముననెంచు । వాడుజగతి
ముప్పతిప్పలుగొను । ముక్తినిగనలేక ॥భక్త॥ 8

ఆ॥ వె॥ అనుభవంబుకలుగు । నమలమూర్తి ధరను
ప్రకటనలవి సల్ప । కకట యెందు
నివురుగప్పినట్టి । నిప్పుచందమునుండు ॥భక్త॥ 85

ఆ॥ వె॥ గాలివలన నరుడు । ఘనమైనపనులను
సలుపగలుగునిలను । సత్యముగను
గాలినిలుపరయము । కాయశుద్ధియగును ॥భక్త॥ 86

ఆ॥ వె॥ మారుతంబునిలుప । మనసునిలుచు వేగ
చూపు నిలుపగాను । సుఖముగలుగు
మనము దృష్టిగలియ । మాయనుబోకార్చు ॥భక్త॥ 87

ఆ॥ వె॥ దేహమస్థిరమని । తెలిసియుండియు నరుల్
మంచితోవబోక । మాయదవిలి
తెలివిలేక తిరిగి । వెలిచూపబడనేల ॥భక్త॥ 68

ఆ॥ వె॥ దండిగ మెడనింద । దారంపుబోగులు
వేసి తిరుగుచుండుగ్రి । విప్రులంట
గుణముకుదురకున్న । గురుతులవేలను ॥భక్త॥ 89

ఆ॥ వె॥ చదువదెంతవరకు । చదివిన ఫలమేమి
గురుని సేవజేయ । కుదురుపడక
మనముకుదిరిన గద । మహివిద్యలన్నియూ ॥భక్త॥ 90

ఆ॥ వె॥ మాయనెరుగని నరు । మాయచేజాతురు
మనుజులకు నదేల । మహితచరిత
తగదు వారికదియె । తగదిద్దుకొనదగు ॥భక్త॥ 91

ఆ వె॥ త్రిగుణములవియేల । తీరుననొక్కటి
సత్వగుణముచాలు । జగతినాకు
మిగిలినవియు రెండు । తగపాడుచేయును ॥భక్త॥ 92

ఆ॥ వె॥ ముక్కుపట్టకుండ । జక్కగానూపిరి
పట్టగలుగునరుడు । పట్టుదలతో
బట్టబయటనున్న । బ్రహ్మంబుజేరదే ॥భక్త॥ 93

ఆ॥ వె॥ ముక్తిఁబొందగలదె । మూర్ఖుండు షట్కర్మ
లాచరించియైన । యవనియందు
సతముసలుప చాలు । సద్గురుభజనంబు ॥భక్త॥ 94

ఆ॥ వె॥ ఆసనములువేయు । టసలెంతకష్టమో
వాతలయముజేయ । వసుధలోన
వసుధవశముగాదె । వాయువులయమైన ॥భక్త॥ 95

ఆ॥ వె॥ కష్టమగునుగాదె । యష్టాంగములొనర్ప
యోగివరులకది సు । సుయాగమగును
కష్టపడినగాదె । కరుణచూపుడువీవు ॥భక్త॥ 96

ఆ॥ వె॥ సిద్ధుడౌటకిలను । సిద్ధాసనముగదా
శ్రేష్ఠమగునుగాన । చింతమాని
దాని నభ్యసించు । వానికిత్తువు ముక్తి ॥భక్త॥ 97

ఆ॥ వె॥ బంధములను మూటి । బంధించి "పద్మాస
నము" ను వేసి నరుడు । నయముమీర
ముక్కుకొనను చూడ । ముక్తసంఘుడుకాడె ॥భక్త॥ 98

ఆ॥ వె॥ కుక్కుటాసనంబు । కూడ పద్మాసన
పలమునిచ్చు నదియు । వలవడినను
నయముగాంతుముగదె । నాడీనమూహంబు ॥భక్త॥ 99

ఆ॥ వె॥ గోముఖాసనంబు । గొనకొనిబంధించి
కంటినడుమచూపు । కదలకుండ
నిల్పగల్గెనేని । విలుచునపానంబు ॥భక్త॥ 100

ఆ॥ వె॥ తలనుక్రిందజేసి । తన కాళ్లచేతులు
మీదవైపుచాచి । మెల్లగాను
అభ్యసింపగలుగ । యనిలపంకంబౌను ॥భక్త॥ 101

ఆ॥ వె॥ విదుషియనగ నెగడు । వేంకటరత్నాంబ
నన్నుగన్నతల్లి । పిన్ననాడె
వీడి చనియెదివికి । వేగమామెనుబ్రోవు ॥భక్త॥ 102

ఆ॥ వె॥ ఘనుడునాకు విత్త । కర్మిష్టినిష్టల
చంద్రశేఖరుండు । జనకుడుదివి
కరగినాడు జూడు । న్యాయవాదియతడు ॥భక్త॥ 103

ఆ॥ వె॥ దేశికుండునాకు । త్రిపురానవంశోద్భ
వుండు ధరను పరమ । పుణ్యపురుష
సతతము నమగాచు । సచ్చితానందుండు ॥భక్త॥ 104

ఆ॥ వె॥ రాగమొప్పగవిత । శ్రీగిరిశెట్టికు
లోద్భవుండునాకు । నొప్పునేర్పె
గౌరవింతు నతవి । ఘనుని రామస్వామి ॥భక్త॥ 105

ఆ॥ వె॥ ఇందు కొంతవరకు । బొందుగానాకూర్పు
బూనిదిద్దు చూవు । గ్రైనెడి నర
సింగరాయ నెంతు । జెలగిమన్మితుర్విని ॥భక్త॥ 106

ఆ॥ వె॥ సాధుశీల నాదు । సతి శ్యామలామణి
యల్పవయసునందె । యంతరించె
గాన నామెజేర్చు । కైవల్యపదవిని ॥భక్త॥ 107

ఆ॥ వె॥ నిష్టగాను నేను । నిష్టల కృష్ణుండ
వ్రాసినాను వంద । పద్యములను
ఆటవెలదులనక । నలుగక గైకొను ॥భక్త॥ 108

ఆ॥ వె॥ హారతులనుగొనుము । ఆర్యానుసన్నుత
హారతులనుగొనుము । యఘవినాశ
హారతుల్గొను హర । హర పార్వతీశ్వర
హారతులివి గంగ । కమలమతికి ॥

స మా ప్త ము .

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ।

